**Pranava Pranayam** - Free verse in Telugu

(Divinity of Love)



**Dr. J. BAPU REDDY,**

Plot 10, Road-5,

Jubilee Hills,

Hyderabad - 500 034 - INDIA

Price Rs. 25 - 00

U.S. $ 5

Published by -

**Jayam Publications**

Plot 10, Road 5, Jubilee Hills,

Hyderabad 500 034, A.P. INDIA

Printed at

**Vipla computer services**

1-8-725/A/1/A, Balaji Bhagyanagar Apts.
Nallakunta, Hyderabad - 500 044

Cover design - **Dr. K. Seshagiri Rao**

Dedicated to the Telugus of North America and relea
**Dr.V. Janardhana Reddy M.D.** TANA Conference Co
( Houston, 1-2, July 1989) First Copy presented to **Dr. All**
(Richland, Georgia).

# అంకితం

ఉత్తర అమెరికాలో భారతీయ సంస్కృతికి వెలుగు స్తంభాలుగా వర్ధిల్లే తెలుగు వారందరికీ, అభిమాన పురస్సరంగా అంకితం.

# ఆవిష్కరణ

ఏడవ ఉత్తర అమెరికా మహాసభల సమావేశ కర్త
**డా॥ వి. జనార్ధన రెడ్డి M.D.** గారిచే ఆవిష్కరించబడినది.
(హ్యూస్టన్, 1-2, జులై, 1989.)

# ప్రథమప్రతి ప్రదానం



విజ్ఞాన ప్రజ్ఞాన సింధువు, సరస ,సాహిత్య బంధువు **డా॥ అల్లూరి రాజు** (రిచ్‌ల్యాండ్, జార్జియా) గారికి ఆత్మీయంగా, స్నేహోపాయనంగా తొలి ప్రతి సమర్పింపబడినది.

# హ్యూస్టన్‌లో ప్రణయోదయం

హ్యూస్టన్‌లో ఏడవ ఉత్తర అమెరికా తెలుగుమహాసభలు (జులై 1-2, 1989) జరుగుతున్నాయని అందులో నన్ను అతిథిగా పాల్గొనమని ఆహ్వానం వచ్చింది. ఇంతవరకే రెండుసార్లు (1979 డెట్రాయిట్, 1985 లాసాంజలస్) ఆ తెలుగు మహా సభల్లో పాల్గొన్న అనుభవంతో వెంటనే నా అంగీకారం తెలిపాను. భారతీయ చైతన్యాన్ని ఖండాంతరాలలో పరిమళింపచేస్తున్న ప్రతిభామయులైన తెలుగువారిని ఒక్కచోట కలిసికొని అభినందించే అవకాశం ఉంటుందని ఆశించాను. అయితే నేనెప్పుడు ఉత్తర అమెరికా తెలుగు మహాసభల్లో పాల్గొన్నా ఉత్త చేతులతో వెళ్ళే ఆచారం లేదు. సృజనాత్మక సాహిత్య గ్రంధాలో, ప్రబోధాత్మక సరసగీతాల క్యాసెట్లో మహా సభల వేదిక మీద ఆవిష్కరించి ఆత్మీయులైన తెలుగు సోదరులందరికీ అందించి ఆనందించాను. నా "అనంత సత్యాలు" "శ్రీకార శిఖరం" అలాంటి అంతర్జాతీయ ఆవిష్కరణ గౌరవం పొందినవే. ఈ మధ్య ప్రపంచ కవుల సమ్మేళనము బ్యాంకాక్ లో జరిగినప్పుడు కూడా నేనక్కడ Urn of Love అనే నా ఆంగ్ల కవితా సంపుటిని సభా ముఖంగా ఆవిష్కరించే అదృష్టం కలిగింది. మరి, ఈ ఏడవ ఉత్తర అమెరికా తెలుగు మహా సభలకు ఏమిటి తీసుకొని వెళ్లాలి? - అని అనుకున్నప్పుడు ఒక విశిష్టమైన క్రొత్త కావ్య సంపుటాన్ని ఉత్తర అమెరికాలోని తెలుగు వారందరికీ స్నేహోపాయనంగా తీసుకవెళ్లాలని నిశ్చయించుకున్నాను. అందుకు మహా సభల సమావేశకర్త మిత్రులు డా॥ వి. జనార్దన రెడ్డి గారి అనుమతి తీసుకున్నాను. పర్యవసానంగా నా సాహిత్య తపస్సులో ఆత్మ జ్ఞానోద్దీప్తమైన "ప్రణవ ప్రణయం" కావ్యాన్ని విజ్ఞాన ప్రజ్ఞాన జిజ్ఞాసువులైన తెలుగు వారందరికీ స్నేహదీపికగా పట్టుకొని వచ్చాను.

ఈ ప్రణవ ప్రణయం ఒక ప్రయోగాత్మక రసానంద కావ్యం. ప్రేయసీ ప్రియులు, సతీపతులు ఇందులో పాత్రలు. ఒక కవిత "అతడు" వినిపిస్తే మరో కవిత "ఆమె" వినిపిస్తుంది. వారు భౌతికంగా సన్నిహితులైనా, ప్రేమయోగంలో తమను తాము అన్వేషించుకుంటున్న తాత్విక జీవులు. లౌకికంలో పారలౌకికాన్ని భౌతికంలో ఆధ్యాత్మికాన్ని దర్శించి పులకించే ధన్యజీవులు వీరు. ఇది కేవల శృంగార కావ్యం కాదు. రాగరసయోగ తత్వ కావ్యం. ప్రణవ ప్రణయ సత్యదర్శన కావ్యం.

ప్రణవం – అనంత సత్య సంకేతం. ప్రణయం – సృజనానంద రసపాతం. ప్రణవ తత్వాన్నీ ప్రణయ తత్వాన్నీ జీవిత సత్యాలుగా దర్శించడమే అనుభవించడమే ప్రగతి తత్త్వం. పరిపక్వ పరిపూర్ణ ప్రేమోన్మీలి ప్రణయం. ప్రణవ ప్రణయ శక్తులు భౌతిక జీవితాన్ని పెనవేసుకున్న భావ సత్యాలు.

ప్రేమ భావం చేతనే జీవాత్మ భౌతిక సంపదను తనదిగా చేసుకుంటుంది. మనం ప్రేమించగలిగేదంతా మనదే. తదితరం ఉన్నా లేకున్నా ఒకటే. స్త్రీ పురుషుల పరిపూర్ణ ప్రేమ బంధంలో, వారి దేహాత్మల పరస్పర సంయోగంలో పరమానంద ప్రాప్తి కలుగుతుంది. మానవ శరీరం వట్టి మట్టి కాదు. జ్ఞాన కర్మేంద్రియాల ద్వారా స్వయం భూత పునర్భూత సృష్టిని అవగాహన చేసుకుని ఆనందానుభూతిని పొందడానికి సాధనం శరీరం. అది ఆత్మాధీన సాధనమే అనుకున్నా ఆత్మానందమే జీవిత లక్ష్య మవుతున్నది. "ఆనందో బ్రహ్మ" అన్న ఉపనిషత్ సూత్రం జీవిత తత్వాన్నీ, సత్యాన్నీ నిర్వచిస్తున్నది – నిరూపిస్తున్నది. భౌతిక సత్యాన్ని పరతత్వాన్ని జోడించే పరిమళ సోపానం ప్రణయం. అందుకే ఈ "ప్రణవ ప్రణయం" భౌతిక సత్యాత్మక భావానంద లహరి.

ప్రణయ శక్తి, ప్రణవ శక్తి, భౌతిక ప్రగతి శక్తి, – ఈ మూడు శక్తులూ ఇంద్రియబద్ధమైన మానవుని దేహాత్మలనుండే ప్రబుద్ధమౌతున్నవి. ఇవి విలక్షణమైనవే కాని పరస్పర విరుద్ధమైనవి కావు. పైగా పరస్పర దోహద కారులు. భౌతిక సంపద, బౌద్ధిక వికాసానికీ, ప్రబుద్ధ బుద్ధి శక్తి, పరిపూర్ణ ఆత్మజ్ఞాన దీప్తికీ ఉపకరించాలి. అందుకే ప్రకృతి పురుష యోగతత్త్వం ప్రతిఫలించే ప్రణయతత్త్వం కూడా మానవ జీవితానంద సత్యం కావాలి.

ఈ పుస్తకానికి పీఠిక వ్రాయమని రసాద్వైత వాది సాహిత్య తత్త్వ వేది అయిన కళా ప్రపూర్ణ పద్మశ్రీ బోయి భీమన్న గారిని అడిగితే, ఒక రమ్యాక్షర మంత్రాక్షరితో నన్ను దీవిస్తూ ఇలాంటి గ్రంధానికి వ్రాయవలసింది పీఠిక కాదు ఒక థీసిస్సు అన్నాడు. ఈ విషయం చెపితే సత్య సాహిత్య మర్మజ్ఞుడైన ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు అవునన్నాడు. ఆ పని ఎవరో చేసేదాకా వేచివుందాం. అందుకనే నేను ఈ గ్రంధం గురించి రేఖా మాత్రంగానే సూచించాను.

నేనింత వరకు ప్రణయభావ పరమైన కావ్య సంపుటాలు రెండు ప్రచురించాను. "ప్రేమారామం" గేయ సంపుటి ఆత్మీయులు ప్రపంచ విఖ్యాత జన్యు శాస్త్రజ్ఞుడు డా॥ పి. మీరా ఖాన్ (Holland) గారికి అంకితం చేశాను. రెండవది వచన కవితలో శృంగార కావ్య భావ సంపుటి "పంచబాణ సంచా". దాన్ని ఆంధ్ర సంఘం (U.K.)ద్వారా తెలుగు సంస్కృతికి ఎనలేని సేవ చేస్తున్న ఆత్మీయులు శ్రీ డి. సుబ్బిరెడ్డి గారికి మొన్ననే లండన్‌లో అంకితం చేశాను. ఇక ఈ "ప్రణవ ప్రణయం" వచన కవితా సంపుటి, ప్రేమ తత్త్వ స్పందిత తృతీయ గ్రంథం. దీన్ని ఉత్తర అమెరికాలోని తెలుగు వారందరికీ ఏడవ ఉత్తర అమెరికా సభల ముఖంగా అంకితం చేస్తున్నందుకు గర్విస్తున్నాను. పుస్తకాన్ని మహా సభల సమావేశ కర్త, తెలుగు వారి చైతన్యానికి అంతర్జాతీయ కీర్తిని ఆర్జించి పెడుతున్న సేవా తత్పరుడు డా॥ వి. జనార్ధన రెడ్డి గారు స్వయంగా ఆవిష్కరించడం ఎంతో ఔచిత్యవంతమౌటమే కాకుండా నా అదృష్టంగా కూడా భావిస్తున్నాను. ఇక ఈ గ్రంథపు తొలి ప్రతిని తెలుగు సంస్కృతికి తెలుగు ప్రతిభకూ ప్రతినిధి అయిన సహృదయతాధుని, విజ్ఞాన ఖని డా॥ అల్లూరి రాజు గారికి అందించే భాగ్యం కలిగినందుకు సైతం ఎంతో ఆనందిస్తున్నాను. వీరికీ, ఈ తెలుగు మహా సభలు ఏర్పాటు చేసిన కార్యవర్గ సభ్యులందరికీ ముఖ్యంగా నన్ను ప్రోత్సహించిన తానా అధ్యక్షులు డా॥ బి. వెంకటేశ్వర రావు గారికి డా॥ ఏ.వి.యస్. రెడ్డి గారికి నాహృదయపూర్వక ధన్యవాదాలు – అభినందనలు. ఒక యాధృచ్ఛికమైన సన్నివేశాన్ని ఇక్కడ ప్రస్తావించాలి. అదేమిటంటే, ప్రణయభావ బంధురమైన నా మూడు మధుర కావ్య సంపుటాలూ, ప్రగతి శీలురూ, ప్రతిభా శాలురు అయిన ప్రవాసాంధ్ర మిత్రులకే అంకితం కావడం.

గతంలో నన్ను అమెరికా గడ్డమీద ఆదరించిన అభిమానించిన ఆప్త మిత్రులందరికి మళ్లీ ఒక సారి ఈ సందర్భంలో కృతజ్ఞతా పూర్వకంగా నమస్కరిస్తున్నాను. పేరు పేరున స్మరించలేక పోయినా పేర్కొనదగిన వారిలో – శ్రీమతి & డా॥ రఘురాం వోల్లాల, శ్రీమతి & శ్రీ యస్. ఆర్. మాచిరాజు, డా॥ కె. సురేందర రెడ్డి, శ్రీ కె. పురుషోత్తమ నాయుడు, డా॥ కె. సుదర్శన రెడ్డి, శ్రీమతి & శ్రీ కె.యం. రావు, శ్రీమతి & శ్రీ ఆనందమోహన్, శ్రీమతి & శ్రీ పి.ఆర్ కృష్ణారెడ్డి,

ఆచార్య వి. నారాయణరావు, శ్రీమతి & శ్రీ సి.బి. రావు, శ్రీమతి & శ్రీ దేవేందర్ రెడ్డి, డా॥ యం. కృష్ణమూర్తి, శ్రీమతి & ఆచార్య టి. వెంకటేశ్వర్లు , డా॥ విద్యాసాగర రావు, శ్రీ జె. బాలాజీ, డా॥ రాఘవేంద్ర యస్. ప్రసాద్, శ్రీమతి కనారిగ్ ( Mrs. Knarig Boyadjian) మొదలైన వారెందరో వున్నారు. అందరికీ నాకృతజ్ఞతా పూర్వక నమస్సుమాంజలులు. నాలో పెంపొందే అంతర్జాతీయ సాహిత్య చైతన్యానికి దోహదం చేస్తున్న ఇలాంటి ప్రపంచ వ్యాప్త మిత్రులందరినీ నా సౌభ్రాత్రతా ఆర్ద్రనేత్రాలతో స్మరిస్తున్నాను. తెలుగు సాహిత్య సంస్కృతులకు విశ్వవేదిక మీద ప్రతిష్ఠాత్మక పీఠం కల్పించాలనే నా దీక్షా సంకల్పాలు అనతి కాలంలో నెరవేరుతాయని విశ్వసిస్తున్నాను. ఖండఖండాలలో భారతీయ సంస్కృతిని పరిమళింప చేస్తున్న తెలుగు వారి ప్రతిభా పాటవాలు ఇందుకు శ్రీరామ రక్ష.

ఈ గ్రంథ ప్రచురణలో నాకు సాహిత్య స్ఫూర్తిని, సకల విధాల సహాయాన్ని అందించిన ఆప్త మిత్రులు డా॥ బోయి భీమన్న, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగార్లకు నా గౌరవ పూర్వక నమస్సుమాంజలులు. వారు ఎంతటి కళా ప్రపూర్ణులో అంతటి జగద్విఖ్యాత విమర్శకాగ్రేసరులు. నా సాహితీ యజ్ఞంలో భాగస్వామినియైన నా జీవితానంద రాగధుని, నా సతీమణి జె. రాజేశ్వరిగారికి నా ప్రేమ పూర్వక ధన్యవాదాలు. ఈ పుస్తకాన్ని ప్రచురించిన జయం పబ్లికేషన్స్ వారికి, ముఖ్యంగా శ్రీ జె. మారుతి గారికి, ముచ్చటైన ముఖ చిత్రాన్ని రచించిన ప్రఖ్యాత చిత్రకారుడు డా॥ కొండపల్లి శేషగిరి రావు గారికి, అధునాతన సాంకేతిక పాటవంతో సర్వాంగ సుందరంగా ఈ గ్రంథాన్ని ముద్రించిన విప్ల కంప్యూటర్ సర్వీసెస్ వారికి, ప్రత్యేకంగా ఆ సంస్థ అధిపతి శ్రీ యమ్. విజయసేనారెడ్డి గారికి ప్రశంసాపూర్వక కృతజ్ఞతలు.

హ్యూస్టన్
జూలై 1 – 2, 1989.

జె. బాపురెడ్డి

# బాపురెడ్డి తపస్సు

బాపురెడ్డి ప్రణయం
ప్రణవ నినాదం,
బాపురెడ్డి ప్రణవం
ప్రణయ వినోదం !

బాపురెడ్డి ప్రణయ మధుర గీతం
ఓం తత్ సత్ పురుషార్థ పునీతం,
బాపురెడ్డి పురుషోత్తమ తత్వం
ఉన్మానస పూర్ణ మానవత్వం !

బాపురెడ్డి కవిత
ప్రగతీశ్వరత,
బాపురెడ్డి తపస్సు
ప్రజా శ్రీ కరోషస్సు!

(డా॥ బాపురెడ్డి తన "ప్రణవ ప్రణయం" కావ్య సంపుటి వ్రాత ప్రతిని నాకిచ్చి అభిప్రాయం వ్రాయమన్నపుడు నా మనస్సుకు తట్టిన గేయం ఇది. ఈ కావ్య సంపుటిపై అభిప్రాయం వ్రాయాలంటే ఏదో ఒక పీఠిక కాదు వ్రాయవలసింది, ఒక సమగ్ర సంపూర్ణమైన పరిశోధనాత్మక థీసిస్సు)

– బోయి భీమన్న

విషయ సూచిక

# అప్రమేయులు

ఆమె మనస్సేమో నింగి
నా మనస్సేమో నేల
అవి కనుమేరల్లో కలిసి ఉంటాయి
కలకాలం వెలుగుతుంటాయి -

ఆమె - ఒక హిమాచల శిఖరం
నేనేమో చంచల పవనాన్ని
నా కలతల మబ్బులన్నీ
ఆమె హృదయాన్ని స్పర్శించి
కరిగిపోతుంటాయి -

భాషా పదఘట్టనాల్లో
నలిగిపోయే పాటను నేను
భాషా శైల శిఖరాన్ని దాటేసి
వెలిగిపోయే భావం ఆమె -

ఆనందం కోసం వెదుకుతున్న
అజ్ఞాన నదిని నేను
తానే ఆనందమైన ప్రజ్ఞాన పయోనిధి ఆమె-

ఒకరు లేక ఒకరు లేని
ఒకే ఉభయులం మేము
ఎవరం ఎవరమో చెప్పలేని
అప్రమేయులం మేము -

# ప్రణయ పారిజాతం

ప్రేమించు ప్రియతమా!
నన్ను ప్రేమించు
నా పంచేంద్రియాలను
నీ ప్రణయామృతంలో ముంచు
నా తనువునూ,
మనస్సునూ, బుద్ధినీ
నీ తన్మయత్వంలో కరిగించు –

నా జీవితాన్ని
అపూర్వప్రేమకలశంగా మార్చి
అందిస్తున్నాను నీకు
ఆస్వాదించు ప్రియతమా!
ఆస్వాదించు
కాలాన్ని నీ కన్నుల్లో మోడ్చి
అనంతాకాశం వైపు శిరస్సెత్తి
ఆస్వాదించు –

తోలుబొమ్మను కాదిప్పుడు నేను
నీ మధుర నామ మంత్రార్చనంలో
మూర్ఛనలు పోయే
ముగ్ధ మోహన లక్ష్మిని నేను
మృత్యుంజయేశ్వరిని నేను –

నీవు ఇంద్రలోకాలు జయించి తెచ్చిన
పారిజాత పరిమళాలు
నా ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో
ఊయలలూగుతున్నాయి
నీ ముద్దుల్ని మూటగట్టుకున్న
నా అంగాంగాలు
శివమెత్తిన నీ శృంగారలీలలో
ఎలా పరవశించి పోతున్నాయో
ప్రాణేశా పరీక్షించు
కరుడు కట్టిన
నా హిమవత్ చేతనాన్ని
గంగా ఝురిలా కరిగించు
ప్రేమించు ప్రియతమా
నన్ను ప్రేమించు!

# ప్రాణ శక్తి

ప్రాణం లేని ఊహల
ప్రదర్శనశాలలో
ప్రాణశక్తివై ప్రసరించావు
కలలను నమ్ముకునే
కవి హృదయంలో
వాస్తవానుభూతివై
ప్రవహించావు -

ఎవరవో! నీవు
ఒక్క చిరునవ్వు గంధంతో
వేలవేల వసంతాల
వీడని బంధం వేశావు
గంగా - వోల్గాలు కలిసినట్లు
నా చేయితో నీ చేయి కలిపావు
అవ్యక్త స్థితమైన,
నా సంక్షుభిత
మానస గగనంలో
సువ్యవస్థితమైన
భావసౌధం నిర్మించావు
నింగినీ నేలనూ కలుపుతూ
సింగిణిలా నీవు నడిచిపోతూ
దేశకాలాలు సమైక్యం చెందిన
దీపంలా నిలచిపోయావు
వేదోపనిషత్తుల విప్లవ క్షేత్రంలో
నాజీవిత ప్రాంగణంలో -

నీ మోవి నామోవి
నింగి నేలల్లాగే కలిసి పోయాయి
మన ఆత్మలు ఆనంద దిక్చ్రక్రంలో తేలిపోయాయి
మనం ప్రవేశించిన గదికి
కాలం గడియవేసింది
చిలిపి చిలిపి చేష్టల్లో మనల్ని కలిపి కలిపి
చిద్విలాసం చేసింది -

సత్యయానవై నీవు
నిత్యగానమై నేను
సాహిత్య సంగీతాలవోలె సంచరించాం
సమతా నందనపథంలో
సుషమా సుఖ వీధుల్లో -

భాషలకందని భావచకోరాలమై
అందీ అందని నెలపాత్రలో
డెందాలను ముంచుకొని
వలపు వెన్నెలల్ని ఆరగించాం -

నరులమో మనం సురలమో
అర్థం కాక
అర్ధరాత్రి నవ్వుకుంది
అవును విజ్ఞాన వినోద వియత్తలంలో
విహరించే నక్షత్రాలం మనం
కష్టాల కారుచీకట్లను జయించిన
కాంతి గీతాలం మనం -

# పల్లవి లేని పాట

ఛందస్సు వదలని
సంప్రదాయ పద్యము లాంటి
సంగీతం లేక కదలని
శాస్త్రీయ గేయంలాంటి
ప్రియుని కోసం
అన్వేషిస్తున్న నన్ను
వచన కవిత్వంలా వచ్చి
పట్టుకున్నావు నీవు –

పల్లవి లేని నీ ప్రేమపాటలు
నియమంలేని నీ పద్యపాదాలు
అలంకారాలు లేని
నీ అయోమయ భావాలు
నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి
ముక్కలు ముక్కలు చేస్తున్నాయి –

నీవు, నా
యతి ప్రాసలు ఎరుగలేవు
గణ విభజన చేయలేవు
గురు లఘువులు గుర్తించలేవు
ప్రియా! నిన్ను పిలిచేదెలా?
సఖా! నిన్ను కొలిచేదెలా?

నీ సూటిమాటల సూదులు
గుచ్చుకుంటున్నాయి పులకలై
నీ మోటు కండరాలు
నన్ను క్రుంగదీస్తున్నాయి
నీ అభ్యుదయ సౌందర్యం
నన్ను ఆవేశపరుస్తున్నది
నీ విప్లవాకృతి
నన్ను విహ్వలను చేస్తున్నది
నీ చిలిపి కోతి చేష్టలు
నాకు చక్కలిగింతలు పెడుతున్నవి –

జానపద సాహిత్యంలాంటి నన్ను
జ్ఞాన పథ సాహిత్యంతో ఏలుకో!
వ్యాకరణాల ముళ్ళు లేని
వాస్తవ కుసుమాన్ని నన్ను
నీ స్వప్నాల గుండెలో తురుముకో –

వేపచెట్టు రావిచెట్టుల్లా
పెనవేసుకుందాం
కాలివ్రేళ్లతో నేలపరుపును గిల్లుతూ
చేతి వ్రేళ్లతో నింగి బుగ్గలు నిమురుతూ
పార్వతీ పరమేశ్వరుల వలె
పరవశించి పోదాం –

–

# అంతరంగ శోభ

నాట్యం చేసింది ఆమె
నా హృదయవేదిక మీద
నవరస రూపిణియై
నవజీవన నాయికయై –

అనంగ శరాలు వర్షించే
ఆంగికాభినయంతో
సకలాంగరోమాంచం కల్పించే
సాత్వికాభినయంతో
అభినవ సత్యభామలా
కటాక్షించింది నన్ను
వెర్రి గోపబాలుణ్ని నన్ను
వేణుగోపాలుణ్ని చేసింది –

ఆలోచనల మల్లెపొదల మాటున
అనుభూతుల మూటలా దాగిన నన్ను
అనురాగాలాపనతో
అనుతాపారాధనతో
కనిపెట్టి పట్టుకున్న
సుందర ప్రభామయి ఆమె
శోభామయి ఆమె –

కలల కాళిందీ తీరంపై
కనుమోడ్చిన నన్ను
అందాల బృందావనమై
ఆవరించింది
కదిలీ కదలని
ఆమె పెదాల మీద
కళ్యాణి రాగం చేసింది నన్ను
నింగినంటే
ఆమె వక్షవృక్షం మీద
పక్షిని చేసింది నన్ను
అందెలు గొంతు విప్పిన
ఆమె కాళ్లమీద
ఆనందంలా ఆడుకుంటున్నాను
కళలు కనులు విప్పిన
ఆమె బొమల మీద
పరమార్థం కనుక్కుంటున్నాను -

# ప్రణయ గీత

నీ బిగువు కౌగిటి ధనుస్సులో
నన్ను బాణంలా సంధించు!
రసానంద శిఖరాలపైకి
ప్రయోగించు! –

స్పృదించే నీ పెదవులతో
నన్ను శంఖంలా పట్టి పూరించు!
భూమి బ్రద్దలయ్యే నాదంలా
నన్ను మ్రోగించు ! –

చైతన్య శిఖరాల్లాంటి
నీ చేతుల మీద
చక్రంలా నన్ను త్రిప్పు!
రసజగద్రహస్యాల ముడివిప్పు ! –

ఏమైనా చేసుకో నన్ను
కాని
నీ ప్రగాఢ ప్రేమాభివ్యక్తిగా చేసుకో!
నీ ఇష్ట కామ్యసిద్ధి శక్తిగా చూసుకో!
ప్రాణసఖా !
పరవశించిన నాదేహంలోని
పంచప్రాణాలు చేదుకో!

# చదువలేని చదువు

ఎన్ని దాహాలు తీరినా
నీమీది మోహదాహం తీరటంలేదు
మోహినీ!
నీ ప్రేమబంధాన్ని మించిన
మోక్షం కనిపించటంలేదు –

చదువు లెన్ని చదువుకున్నా
అరమోడ్చిన నీ కళ్లకు
అర్థం తెలియటం లేదు
నీ విషయమే తప్ప
నాకు ఏ విషయం రుచించటంలేదు –

ఆత్మజ్ఞాన పాత్రలో
ఆనందం అనుభవిద్దామనుకొంటే
మదవతీ! నీ అధర సుధాధారలు
నా మతి వీడటం లేదు –

ఎన్ని కొండలు ఎక్కినా
ఎన్ని గుళ్లకు మ్రొక్కినా
నీవలపు శిఖరాల నుంచి
నా వాంఛ దిగిరావటంలేదు –

మట్టి బొమ్మవైన నీలో
ఇంతటి మాహాత్మ్యం ఏమిటి ?
మనోహరీ! నా మీద
నీ మాయాజాలం ఏమిటి?

# ప్రణయ లీల

గాండీవం లాంటి
నీ బాహువుల్లో
శరంలా బిగించావు నన్ను
విడువకు విడువకు స్వామీ!
ప్రణయ లోకాలు
బ్రద్దలైపోతాయి –

పూర్ణబింబంలా ముడిచిన
నీ పెదవులతో
శంఖంలా నన్ను పూరిస్తున్నావు
వదలకు వదలకు నాథా!
సృష్టి అంతా శూన్యమై పోతుంది –

నీ నఖ విన్యాస విలాస క్రీడలో
నక్షత్రాలు మొలుస్తున్నాయి
నా ఆర్జవ శరీర క్షేత్రంలో –
ఆపకు ఆపకు ప్రియతమా !
అంధకారం అలుముకుంటుంది –

నా స్వప్నాల పూలడోలికలో
సత్యమవై ఊగుతున్నావు
విశ్రమించకు ఆత్మసఖా!
కాలగతి ఆగిపోతుంది.

# విచిత్ర వాణి

శంఖంలాంటి కంఠంతో
చక్రంలాంటి ముఖంతో
నను నడిపించే రాణివి నీవు
తలకూ పిరుదులకూ మధ్య
తంత్రుల్లాంటి జడలతో
వీణ రూపం వహించిన
విచిత్ర వాణివి నీవు –

అందుకే నీ చుట్టూ
నా ప్రదక్షణ
నీవిందు కోసం
ఇంత నిరీక్షణ –

సాష్టాంగ నమస్కారాలతో
సాధిస్తున్నాను నిన్ను
నా కలల కలువపూల దండలతో
పూజిస్తున్నాను నిన్ను
రావే నా రాగభగవతీ!
రసరాజ్యా లేలుకుందాం
సౌంధ్యతమాల పర్యంకంలో
కనులు మూసి
సత్య సత్వరాగోదయంలో
మేలుకుందాం –

# శూలి శూలం

ప్రియా!
నేనొక హరిణాన్ని
వేటాడు నన్ను హరిలా
నరహరివై –

మోహతప్తమైన నా దేహాన్ని
ముక్కలు ముక్కలు చెయ్యి
మండిపోతున్న నా కండరాలను
ఖండ ఖండాలుగా కొయ్యి –

రగిలిపోతున్న
నారక్తం తీసుకో
నీవిజయాక్షర వక్షం మీద
వీరగంధంగా పూసుకో
నా బ్రతుకును పట్టి పీడిస్తున్న
భయాలను
నీ బాహుబలంతో తొలగించు
త్యాగజనిత భోగదాయక
ప్రేమదృష్టి ప్రసాదించు

# రసతపస్సు



ఆస్తినాస్తి సంగమించిన
నీ కటిరేఖా తటిమీద
ప్రతిష్ఠించాను
నా ఆత్మ లింగాన్ని
కామాక్షీ! కదిపేయి
నీ శ్రీకర కర విన్యాస లాస్యంతో
నా హృషీకేశ మస్తక శృంగాన్ని

నీ పాద పద్మాసన
యోగస్థితిలో రమిస్తున్నాను
నా ముక్తి భ్రమాభ్రమర భ్రమణం
విరమిస్తున్నాను
నీ దయా ధర్మ వీక్షణాలతో
రసానందం అనుగ్రహించు!
నీ మార్మిక ధవళమందహాసంతో
నా శూన్యభావ కుహరాన్ని వెలిగించు -

నీ అరుణారుణ అధర బింబంతో
చిమ్మ చీకట్లలో చిక్కిన
నా కళ్లను చుంబించు
రాగోషస్వినివై -

జరామరణ భయం లేని
నీ పరీరంభ సుఖంలో
నన్ను బంధించి రక్షించు -

# వెలుగు నీడలు

మండే నా కామాగ్నిని
నీ వలపు జల్లుతో ఆర్పేయి!
నా గర్భకోశ కేదారంలో
ఆశా వసంతాలు నాటేయి!
నా ఆలోచనా పథాలలో
కిర్మీర స్వప్నాలు పరిచేయి –

నా శిలామయ శరీరాన్ని
నీ మురిపాల ముద్దులతో తొలిచేయి!
నీ పులకిత గాత్ర పరిష్వంగంలో
నా మత్తు మాంద్యం తుడిచేయి.

నా ప్రసన్న వదనంలో
నీ ప్రతాప ప్రజ్వలనాన్ని ప్రతిబింబించు
నా శిథిల జీవితాలయంలో
నీ విజయ ధ్వజస్థంభాన్ని ప్రతిష్ఠించు
నా మౌన మనోరమణా!
నానోట
నీ ప్రేరణగీతాలు పలికించు!
నీడవంటి నా వెంట నిరతం
నీవు వెలుగులా పయనించు.

# ప్రేమదృష్టి - జీవసృష్టి

మృదుల సైకత శయ్యలమీద
హృదయ ఘోష పడలేక
ఆవిరియై పైకి లేచి
కామతప్త భూగర్భంలో
జీవవృష్టి కురిపిస్తున్నాడు
మహాశయుడు సాగరుడు -

నిమీల నేత్రి కాళరాత్రి
తమక మూర్ఛిత గాత్రంపై
నక్షత్ర మల్లికలు చల్లుతున్నాడు
వలపు వెన్నెల కరాలతో
విలాసగగనేంద్రుడు చంద్రుడు -

మోహోద్విగ్నంగా నగ్నంగా
కలకంఠ కంఠమెత్తి మొరపెట్టే
వనకాంత వక్షంపై
ప్రాణ పల్లవాలు కురిపిస్తున్నాడు
ప్రణయ భావోద్దీపుడు వసంతుడు
అందుకే! ఓ ప్రేయసీ
సృష్టిరహస్యం తెలిసిన
నీ సుషమోదర క్షేత్రంలో
ప్రేమ వృష్టి కురిపిస్తున్నాను
శృంగార సాగర తరంగ
శేషతల్పంనుంచి లేచివచ్చిన
పురుషోత్తముడను పురుషార్థ ధ్వజుడను
నీ ప్రియుడను.

# నాద భ్రమణం

నాముఖ చక్రం
నీ చేతులతో
నాగళ శంఖం
నీ పెదువులతో
చైతన్యోద్దీప్తమౌతున్నవి

అబ్బా!
ఏమిటీ భ్రమణం
ఏమిటీ నాదం
భూమి బ్రద్దలౌతున్నది –

నీ సృజన శృంగార సంగరం
ఆపేయి!
నా తనూరథ ప్రచోదకా
నా ఆత్మ ప్రమోదకా
సఖా!

# ఆదిమాలింగనం

నా ప్రస్థానత్రయ పాండిత్యం
నీ గభీర నతనాభి లోయలో
కూలిపోయింది –
నా సకల శాస్త్ర విజ్ఞాన సర్వస్వం
నీ శిరోజ నీలి శిఖరాల ముందు
తెల్లబోయింది –

దిక్కు తెలియని దిగంబరులం మనం
చిక్కుకున్నాం
ద్విశరీరాలింగనైక
శ్రీకారాకారాదిమబంధంలో
ప్రాణసఖీ
నా ఆశాకాశ పూర్ణచంద్రముఖీ!

మాయా ప్రకృతి పాఠాలను
మన ఇంద్రియాలు వల్లిస్తున్నవి
ఇహ పరాతీత భాషాభావాతీత
ప్రశాంతకాంతి సాగరంలో
మన నగ్నాత్మలు విహరిస్తున్నవి
కొటారు కొమ్మపై కూర్చున్న
కొంటె గోవిందుణ్ని
ఆనంద చేలాలు అర్థిస్తున్నవి

# హరి – హరిణి

విశాలమైన నీవక్షస్థలం మీద
విహరించే నా చూపులు
నాకంటి పాపల తెరలమీద
నాకలోకాలు సృష్టిస్తున్నాయి
నీ ఉద్దండ బాహు దండాలమీద
ఊగిపోతున్న నా ఊహాలు
నీ నిస్తుల మస్తకంమీద
వాస్తవాలై మెరుస్తున్నాయి –

నాథా, నాథా! అంటూ
నా నాలుక నాట్యం చేస్తున్నది
నీ వజ్ర ధంత వేదిక మీద
పారవశ్యపు పరదాల వెనుక –

నీ చైతన్య శక్తి బిందువులు
నా నిశ్చలతా సింధు శుక్తిలో రాలి
మన బాధా ముక్తి ముక్తాఫలాలై
మధురానుభూతి కలిగిస్తున్నవి –

నా నరహరివి నీవు
నీ మనోహరిని నేను
నీవు హరి నేను హరిణి
ఆటో వేటో తెలియని
అనుబంధం మనది.

# చుక్కల సెలయేరు

నీ
అపూర్వ సౌందర్యం
నన్ను
ఆలింగనం చేసుకున్నపుడు
ముగ్ధుణ్నై మూర్ఛపోయాను
నా కనుల కవాటాలు తెరచి
మేలుకొన్న కలలు
నన్ను గేలి చేసినప్పుడు
మన చుట్టూ ఆవరించిన నిలువుటద్దాలు
మన నగ్న రూపాలను చూచి
మాయామయంగా నవ్వుకున్నాయి -

బంగారు బొంగరాలు రెండు
బ్రహ్మాండం బ్రద్దలయ్యేటట్లు
నాగుండె మీద నీవు త్రిప్పుతుంటే
బోధపడని బాధతో
నాకళ్లు
గిర గిరా తిరిగిపోయాయి
చిక్కని నీ కురులు
చిమ్మిన చీకట్లలో
అంతా శూన్యంగానే కనిపించింది నాకు
నా సరసభావ తరంగాలు
నా పెదవుల దాక చేరలేక
నీ పదముల చెంతనే
చెదరి పోయాయి -

శృంగార శిఖరాల నుండి
చుక్కల ఏరులా పారిన
ఆ బంగారు అనుభూతి
నీ ఆత్మార్ణనం వైపే ప్రవహించింది
ఆగ్రహించినా అనుగ్రహించినా
నిన్ను అందుకోలేని
ఆశాతరంగాన్ని నేను
అందుకే
నా నెచ్చెలీ
నీవే
నన్ను అందుకొని
ఆదరించాలి !

# మంత్ర దండం

నా ఒంటిలోని
రక్త తరంగ తురంగాలకు
దౌడు నేర్పే రౌతు వీవు –

నా ముకుళిత చర్మచక్షువులకు
వికసనం నేర్పే
మర్మకిరణ మార్తాండుడ వీవు –

నా పసుపు పారాణి పాదాలకు
చెమట బిందువుల చిరుగజ్జెల పాట నేర్పే
మోహ మృదంగ వాదకుడ వీవు –

నా నూగారు నల్ల త్రాచుచే
రాగాల నాట్యమాడించే
భోగభోగినీ పాలకుడ వీవు –

తీరిక లేని నా కోరికలు తీర్చే
మంత్ర దండం ధరించిన
మహేంద్రజాలికుడ వీవు –

ఇన్ని కళా కౌశలాలతో
నాధా నన్ను వేటాడుతుంటే
నే రెప్ప వాల్చే దెలా !

# సృష్టి రహస్యం

నీ శూన్యోదరాకాశం చుట్టూ
నా సుదీర్ఘ బాహువుల్ని చుట్టి
సృష్టి రహస్యాన్ని శోధిస్తున్నాను
ఈ కొండలు, కోనలు, మబ్బులు
ఈ మెరుపులు, ఉరుములు, జల్లులు
ఈ వంపులు, సొంపులు, ముంపులు
మలయ మారుతాలు, విలయఘాతాలు
గురుత్వాకర్షణ, విభిన్న తత్వ ఘర్షణ
నీ సత్య సౌందర్య ప్రకృతికి
నీడలుగా, జాడలుగా భావిస్తున్నాను
సృష్టి రహస్యాన్ని శోధిస్తున్నాను -

నా కౌగిటిలో ఒదిగిన నిన్ను
కలగా చూస్తున్నాను
నీ సరస సంకేతాలకు అర్థం తెలియక
నేను సాధించిన విజయానికి
విలువ కట్టలేక పోతున్నాను
సృష్టి రహస్యాన్ని శోధిస్తున్నాను -

రసావతార మూర్తివైన నీవు
రసోహం అనుకునే నాకు
ఇంకా రహస్యంగానే ఉన్నావు
నీపొందులో నేను పొందే ఆనందం
నిజమో మాయో తెలియని
సందేహావస్థలోనే ఉన్నాను
సృష్టిరహస్యాన్ని శోధిస్తున్నాను-

# ఆపాద మస్తకం పుస్తకం

నా ఆపాదమస్తకం
ఓ పుస్తకంగా చదివేస్తున్నావు
కుసుమాస్త్ర విద్యాపరీక్షకు
కూర్చోబోతున్నావా
ప్రేమార్థీ!

నా హస్తరేఖా లేఖల్ని
కనులు మూసుకొని చదివేస్తున్నావు
కటిక చీకటిలో కూడా
నీ తేనె పెదవుల
తెలుగుభాషలో -

అరమోడ్చిన
నా కనులలో చొరబడి
అర్థాలు వెతుకుతున్నాయి అదే పనిగా
నీ కొంటె చూపుల వ్యాకరణాలు -

నా భావోద్ధత
హృదయ ప్రబంధ స్కంధాలను
మధించాలని ఆవేశపడుతున్నది
నీ మధుర విజ్ఞాన జిజ్ఞాస -

నా చెమ్మగిల్లిన శరీరం మీద
నాకానుభవ టీకా తాత్పర్యాలు
చిలిపి చిలిపి లిపిలో
చిత్రంగా వ్రాసుకుంటున్నాయి
నీ కరచరణాల కలాలు

ఇంత శ్రద్ధగా
త్రికరణ శుద్ధిగా
స్త్రీ విద్యాధ్యయనం చేసే
నిత్య సత్య రత్యార్థీ !
నీకు జయోస్తు!
ఎన్ని అగ్ని పరీక్షల్లోనైనా
ఇట్టే గెలుస్తావు

# విప్లవ బాల

నీ వాక విచిత్ర బాలవు
నీ వాక విప్లవ జ్వాలవు
అర్థంకాని భాషలో
నా కేవో బోధించావు
కరుడు కట్టిన
ఛాందసభావాల మీద
క్రాంత విజయం సాధించావు -

విశ్వ వీధులలో తిరుగాడే
నా వెర్రి మొర్రి ఆలోచనలు
వినీలాకాశాన్ని విస్కీలా త్రాగేసి
కాలానికి దారి చూపే
నీ కళ్ల చూట్టూ
కాటుకలై తిరుగుతున్నాయి -

సౌందర్యాలను చూచి తూచి
సత్యాలను మూటగట్టుకున్న
నా చంచలమైన చూపులు
నీ నగ్న సౌందర్యం చుట్టూ
పదేపదే ప్రదక్షిణం చేస్తూ
కేంద్రాన్ని రక్షించే పరిధుల్లా
కుండలీకృతమై పోయాయి -

నీకు దూరంగా ఉన్నా
దగ్గరగా ఉన్నా
అది నా భ్రమా భ్రమర భ్రమణమే తప్ప
నా అన్ని ఆనందానుభూతి పరిధుల్లో
ఏకైక శృంగార నాద కళా కేంద్ర బిందువు
నీవే.

# ప్రణయాలయం

వెలుతురే మానవాకృతిలో
వెల్లకిల పడుకున్నట్లు
అరమోడ్చిన కనులతో
ఆకాశాన్ని శోధిస్తున్నట్లు
నేలపై నేను పరచిన
పూలసెజ్జలో పవళించిన నీవు
సఖా! ప్రణయ ముఖా!
సరసమాడ వచ్చాను
లేవయ్యా, మేలుకోవయ్యా!
పైకి చూచే నీ పాదద్వయం
నా ప్రణయాలయ గోపురంగా
భాసిస్తున్నది
అలవోకగా సాచిన
నీ ఆజాను బాహువులు
నా మనోమందిర ప్రాకార
మంటపాలుగా రూపిస్తున్నవి -

నీ వీర విశాల వక్షస్థలం
అనల్ప శిల్ప కల్పనామయ
దేవాలయ ముఖ మండపంలా దీపిస్తున్నది -

ఇక నీ చకచ్చకిత ముకిళిత నయనాల
మోహన ముఖ బింబమేమో
నా ప్రేమ పారవశ్య
గర్భాలయంలా ఉంది -

ప్రాణేశ్వరా నిన్ను
నేను పట్టిలేపేదెట్లు!
గజగజలాడి పోతున్నవి
నా గర్వోన్నతులన్నీ
గగుర్పాటు చెందుతున్నది
నా గాత్రము -

దర్శిస్తున్నాను
నీ మదన రూప సౌందర్యాన్ని
స్పర్శిస్తున్నాను
నీ సర్వేంద్రియ నగ్న సత్యాన్ని
ఆరాధిస్తున్నాను నిన్ను
ఆపాద మస్తకం చుంబిస్తూ
నీ తరళ దరహాసంలో
ప్రతిబింబిస్తూ
మేలుకో
నీ విద్యుత్ బాహువుల్లో బంధించి
నన్ను ఏలుకో!
మన ప్రేమ విజయ స్తంభం మీద
విప్లవ ధ్వజం కడదాం
శృంగార శైల శృంగాలకు
వీర హారతి పడదాం.

# నీ పొందుకోసం

"నిను తెచ్చుకోలేక
నీ బొమ్మతెచ్చుకొని
ఆరాధిస్తున్నాను"
అన్నాడొక మహాకవి
అయితే
నీ బొమ్మలో లేనిది ఏదో
నీలో వున్నది
అందుకే
నిన్ను శోధిస్తున్నది
పూజిస్తున్నది
నా మనసు –

ఇన్ని పువ్వుల్లో లేని గంధం
ఏదో నీ నవ్వులో ఉంది
ఇన్ని దీపాల్లో లేని కాంతి
ఏదో నీ కన్నుల్లో ఉంది
ఇన్ని మధువుల్లో లేని మత్తు
ఏదో నీ మాటల్లో ఉంది
ఇన్ని కవితల్లో లేని సత్యం
ఏదో నీమౌనంలో ఉంది
ఎన్ని జయించినా లేని గర్వం
ఏదో నిన్ను జయించడంలో ఉంది
ఇన్ని ప్రేమ గాథల్లో లేనిది
ఏదో మన ప్రేమ కథలో ఉంది

అందుకే
నీవు నావెంట ఉంటే
అందుకోలేని దేముంది
నీ చేతిలో లేని గీత
నా జాతకంలో ఏముంటుంది
అందుకే
నీ పొందు కోసం
నేనింతగా పరితపిస్తున్నది
సఖియా!
నేను జీవిస్తున్నది -

# తాంత్రికుడు

ప్రణయ సఖా! నీ చూపులు
నన్ను వేధిస్తున్నాయి
బాధిస్తున్నాయి
అయినా
ఆ చూపుల్ని
తప్పు అనలేక పోతున్నాను
తప్పు
ఒకే దిశలో వెళుతుంది
ఏదో ఒక చోట
తగులుతుంది
మరి నీ చూపో
ఒకేసారి
పలుదిక్కుల్లో
దూసుకుపోతుంది
ఏక కాలంలో
నా సకలాంగాలను
బాకులా గ్రుచ్చుకుంటుంది -

నా పంచేంద్రియాలు,
పంచ ప్రాణాలు
నీ పంచబాణసంచా పర్వంలో
పరవశించి పోతున్నాయి
మదనా! అని సంబోధిస్తే
మాట సరిపోవడం లేదు
నా ఎడద కడలి
మరిగించే భాస్కరా
నా వలపు తేనె
దొంగిలించే తస్కరా
నిన్ను దేనితో పోల్చాలో తెలియక
నివ్వెర బోతున్నాను
నీవు
మాంత్రికుడవో
తాంత్రికుడవో
యాంత్రికుడవో
తోచక
నిలువున నీరై పోతున్నాను
నీ స్మృతిలో
నీ ద్యుతిలో
నా మతి కోల్పోతున్నాను.

# అమృత ధామం

ప్రకృతి పార్వతి పాటలాంటి
రైను నది తరంగాలు
ప్రగతి లక్ష్మి బాటలాంటి
సుందర శాంత మహాసాగర
సుదీర్ఘ తీరాలు బ్రహ్మరథం పట్టినవి
మన ప్రణవ ప్రణయ జైత్రయాత్రకు -

పాతాళపు లోతుల్లోకి దూకి
తరుణ కిరణ హస్తాలతో
ఇంద్ర ధనుస్సుల్ని ఎక్కుపెట్టి
ఆకాశంతో ఆడుకునే
నయాగరా జలపాతాలు
విజయీభవా అంటూ
మన మీద మల్లెల మొల్లల
జల్లులు కురిపించాయి -

కాంతి బావుటా పట్టుకొని
కాలాన్ని కేలెత్తి పిలిచే
* "స్వేచ్ఛామూర్తి" మనల్ని చూచి
చిరు నవ్వుల నౌక పంపించి
తన నడి సంద్రపు గుడిలోకి ఆహ్వానించింది
పవిత్ర ప్రణయ తత్వ తరంగ
పాఠాలు బోధించింది -

* Statue of Liberty

నెచ్చెలీ!
భావభౌతికానంద
జీవన నందనంలో
మనం లీలా విలాస విహారం చేస్తూ
నేల పరుప్పై పడుకున్నపుడు
మన చూపులు
చుక్కల తోటలో చొరబడి
సుగంధ మరందాలు
సేకరిస్తున్నపుడు
మన చుట్టూ వున్న మట్టి పులకించి
కుకెన్ హాఫ్
పూల కడలి అయింది
మన శరీర క్షేత్రంలో విరిసిన
ఆత్మానుభవ అక్షరారామం
అమృత ధామం అయింది.

# తాదాత్మ్యం

నీ తలపుల వేణువులో
నా హృదయం చిక్కుకుంది
నీవు ఎలా ఊదినా అది నా పాటే అవుతుంది

నీ విభిన్న ఇతివృత్తాల జీవిత వృత్తంలో
నా ప్రేమనాదం
కేంద్రబిందు వైపోయింది
నీవు ఏ భాషలో ఏ భాష్యం చెప్పినా
అధి నా తత్వమే అవుతుంది -

నీ గమనానికి గమ్యమై పోయాను నేను
నీ రథం పథం ఏదైనా
నీవు ఏపాత్రలో ఏ యాత్ర చేసినా
అది నా యాత్రే అవుతుంది -

నీ చిత్ర జగత్ చైత్రంలో
నా కామరూపాన్ని కలిపి వేశాను
నీవు వేసే రంగులు గీసే రేఖలు ఏవైనా
అది నా రూపమే అవుతుంది -

ప్రేయసి అంటే ఏమిటో
ప్రియతమా తెలిసికో!
నన్ను తప్పించుకు తిరుగుదామనే నాటకం మ

# రంగుల పల్లకి

ఇంద్రలోకాల నుండి
ఏడు రంగుల పల్లకీ వచ్చి
నింగి ముంగిట నిలిచింది
కామనా కమలాప్తుడు, సూర్యుడు
కాంతి దూతల్ని పంపించాడు బోయీలుగా
కలల లోకాలలో మన కళ్యాణం జరిపించడానికి

సుముహూర్తం దాటిపోకుండానే
శోభాకరంగా ముస్తాబుకా
ఎందరెందరి దేవతల దీవెనలతో
విరబూచిందో మన వలపు వల్లిక
అందుకే ఈ హరివిల్లు పల్లకి –

కర్మసాక్షి కరుణా కిరణాల
కళ్యాణ మంటపంలో
ధర్మపత్నీపతులమై దర్శిద్దాం జీవితాన్ని
మాయా మర్మాలు లేని మానవత్వాన్ని
మధురానంద ప్రేమతత్వాన్ని –

ఏలోకంలోనో ఉన్నా మనుకొన్నాను
ఈ లోకంలోనే ఉన్నాం
చీకు చింతల్ని
పూల సజ్జలో పూడ్చేసి
ఒకరి కౌగిటిలో ఒకరం
ఒడలు మరచి చిక్కుకున్నాం –

# సబల అబల

" ఏ రంగంలోనైనా సబలనే
ఒక్క నీ పరిష్వంగంలో తప్ప" అంటు
నేను సాగించిన సరస సంభాషణం
సఖా! నీకు జ్ఞాపకం ఉందా!
"అంతటి బలం నాకిచ్చింది
అబలవైన నీవే" అని నీవు
పరిహాసమాడినపుడు
సిగ్గుతో ఎరుపెక్కిన నా బుగ్గల మీద
చుంబన శ్రీకారం చుట్టావు
మరచిపోలేదు గదా! మహానుభావా -
చేతలలో సరేసరి
కనీసం మాటలలోకూడా
నిన్ను ఓడించనీయని మర్మజ్ఞుడవు నీవు

నా సర్వస్వం దోచుకొని
"మనోహరీ" అంటూ నన్నే
అపరాధను చేసే ధర్మజ్ఞుడవు నీవు -

నా మత్తు మాటల ఈటెల్ని
నీ మౌనంతో విరిచేస్తావు
నా మౌనదీక్షా రక్షా కవచాన్ని
ఒక్క మాటతో, తొలిచేస్తావు
నన్ను వేధిస్తున్న ప్రాణేశా
నిన్ను సాధించే దెట్లా ?

# యోషా భాష

మన్మధ బాధ చెప్పడానికి
మనిషి చేసిన ప్రయత్నమే
"భాష"
అయిందనుకుంటాను -

భాషలేని నాటి
ప్రేమ
ఎంత బాధాకరంగా ఉండేదో
నీవు లేనప్పుడు
నేను పడ్డ బాధలా -
బోధపడని నా బాధకు
భాష నీవు
భాషలన్నిటి బాధ తీర్చిన
యోష నీవు -

నీవు మౌనంగా ఉన్నప్పుడు
నా భాషవు
నను పలికించే యోషవు
మరి నీవు మాట్లాడితే
నాకు వేరే భాషెందుకు
అది నాభాషే కదా!

అందుకే
నేను నేర్చుకొనే విద్యలన్నీ
నీవలననే
నీవు లేకుంటే నా కంతా
నిశ్శబ్దమే!

అన్ని భాషలు చూశాక
అన్ని భాష్యాలు విన్నాక
నే కనుగొన్నది
నీ భాషయే
నా కవగతమయింది నీ భాష్యమే
యోషాభాషా భాష్యం -

నేను అర్ధరాత్రి ప్రవచించే
ఈ పరిపూర్ణ జీవిత భాష్యం
నీ అంగాంగాలు వింటున్నాయి
"ఔనౌను అక్షరాలా నిజం"
అంటున్నాయి -

# కటి తటి

నీ కటితటి కంకటి మీద నిద్రిస్తూ
కలల కడలి అలల మీద
తేలిపోతున్నాను -

నీ వీర ప్రతాప
వదనాదిత్య మండలం ముందు
శాంత సంతృప్త
చంద్ర బింబంలా పడి ఉన్నాను -

గాలిపటాల వంటి
నీ ఊహలకు
దారం లాంటి ఆధారం నేను
నక్షత్రాల వంటి నీ ఆశల బీజాలు
మొలకెత్తే కేదారం నేను -

అవిభాజ్య బిందువులాంటి
మన సమాలింగన బంధాన్ని
ఆవరించిన ఆనంద దిక్చక్రం
మన జీవిత వృత్తాన్ని నిర్వచిస్తున్నది
దేశకాలాలను
మన కళ్లకు దివిటీలుగా వెలిగిస్తున్నది
స్వామీ! నా అంతర్యామీ !
ఇంతకంటే
నాకు కావలసింది ఏమి?

# ముఖా ముఖీ

ముఖా ముఖీ కూర్చున్నాము సఖీ!
నీకూ నాకూ మధ్య నిలిచిన
అల్పాతి అల్ప దూరం
అనంతంలా భాసించింది
నిన్ను చేరనీయని
నిషేధాత్మక నిస్సహాయ స్థితిలో–

దేశకాలాలను కొలిచాను
నాగుండె దడతో
తడబడే నా తలపుల అడుగులతో –

అగాధమైన నీ మనోమండలాన్ని
అద్దాల కిటికీల వంటి నీ కళ్ల గుండా
కలయ జూశాను –

నీ వెండి నవ్వుల వెలుగు తెరపై
భూమి ఆకాశాన్ని చుంబించే
దిక్చక్రం నాకు దిక్కు చూపించింది
నీకు నాకూ మధ్య దూరం
నా నిగ్రహించలేని ప్రేమావేశంలో
నీ అనుగ్రహ రేఖా మాత్రంగా
కరిగిపోయింది –

# పరీక్షలెందుకు

పేరూ ఊరూ తెలియని
నిన్ను ప్రేమిస్తున్నాను
విశ్వసించని నీకు
వివరించే దెలా!

నా తనూ ధనువును విరిచే
మనోభిరామా!
నీ శివసుందర శక్తిని  పరీక్షించడానికి
స్వయంవర సంరంభం ఎందుకు?

నీ కామరశ్మిలో జ్వలించి
ప్రేమ పరిమళ దీప్త
కాంచన జ్వాలా మాలిక నైనాను
విధేయతా అగ్ని పరీక్షలు నాకు
వేరే ఎందుకు?

నీ జీవిత మహారణ్యమే శరణ్యమైన
ఈ వియోగ విపినాంతర
సంకట కంటక కంకటిపై
శయనించడానికి
భయమెందుకు?
అందుకే మన అనుబంధం పట్ల
అనుమానాలెందుకు?

# విలాస కైలాసం

మసక చీకటి చీర కట్టుకొని
మస్పణ ఊహల సంధ్యా వేదిక మీద
సకియా!
నీవు సాక్షాత్కరించావు
వైశాఖ పూర్ణిమార్ణవంలో
వరలక్ష్మిలా
ఉదయించావు –

విమల సమతా సైకతాల నుండి
విలాస కైలాస శిఖరాల వరకు
ఆడుతూ పాడుతూ విహరించాం
నీ వెవరో నే నెవరో తెలియని
భావంలో పరవశించాం –

సరస సాగరజవు,
శక్తి శైలజవు
నా మనోజవు నీవు
అందుకే నన్ను
ఆనంద మూర్తిని చేయమని
అర్ధనారీశ్వరుణ్ని చేయమని
అర్థించాను నిన్ను –

చేయిచేయి గిలించి
తనువు తనువు జోడించి
ఈ పృధ్వి మీద చిద్విలాసం
చిందుదామని ప్రార్థించాను -

తనువు గూర్చి,
మనస్సు గూర్చి
తత్వా లేవో బోధిస్తుంటే
నీ నిర్వేద హృదయంలో
నీ మధుర రూపం
విశ్వచైతన్య రాగ దీపంగా
వెలిగి పోయింది.

# ప్రకృతి ప్రబోధం

ప్రాణేశా!
ఈ ప్రకృతి
నీతో పరిహాసమాడుతున్నది
పేరుమ్మణ్ణని మురిసేవాడా
నీ ప్రకృతి ధర్మం
మరచిపోయావా - అని
పరిహాసమాడుతున్నది
ఫక్కుమని నవ్వుతున్నది -

సందేహంలో పడ్డవాడు
సరసమాడలేడని
సాహసం లేని వానికి
సంతోషం లేదని
కొండ లోయల గుండె
గండు కోయిలై కూస్తున్నది -

అవకాశం దొరికినప్పుడు
ఆకాశం కేసి చూసేవారికి
దక్కేది శూన్యమేనని
నీ ప్రక్కనున్న చుక్క
ప్రవచిస్తున్నది -

ఉన్న దానికి లేని దానికి
తల పట్టుకొనే వానికి
ఉన్నది కాస్తా
సున్నా అయిపోతుందని
వన్నెలాడి వెన్నెల
కన్నుగీటి చెపుతున్నది –

నిన్ను చూచి జాలివేసి
ఇన్ని వివరాలు చెప్పాను
నా కన్నుల్లోని కాంతి చక్రాలు
ప్రసారం చేసే సంకేతాలను
కనలేని నా కన్నయ్యా
ఇప్పుడైనా కాస్త
ఇంగితజ్ఞానం తెచ్చుకో!

నీ తమకంతో
నా చుబుకం పట్టుకొని
అద్దంలాంటి నా మోములో
వెలుగు జాడలు చూచుకో!
దిక్కులు చూడడం మానేసి
నీ దిక్కు
నేనేనని తెలిసికో!

# నిరుపమానుల ఉపమానం

నా నడుం చుట్టు నీ చేయి
నీ నడుంచుట్టు నా చేయి
పెనవేసికొని నడిచి పోయాం
వైశాఖ పూర్ణిమార్ణవ
విశాల సైకతాల మీద –

మన చేతి వ్రేళ్ల కొసలనుండి
సకలలోకాలు
స్వర లహరు లైపోయిన
సజీవ స్వప్నంలో స్పందించాం
కదిలే మన చరణాల సవ్వడికి
భాష్యం చెప్పింది
నిదురలేచిన నిశ్శబ్దం
ఊగిపోయే మన ఒడలి పడవలకు
లంగరు వేసింది
గడ్డగట్టిన గాలి –

నీవు మౌనం
నేను మౌనం
మన ఇద్దరి మధ్య లేచిన
ఇసుక రేణువుల తెర
ముసిముసిగా నవ్వుతుంది –

చెప్పరాని అనుభూతిని
చెప్పలేక నీవు
చెప్పలేక నేను
ఎవరు నీవంటే ఎవరు నీవన్నట్లు
ఎక్కుపెట్టాం కనుబొమలు
ఒకరిలో ఒకరిని చూచుకొని
ఉలిక్కి పడి తేరుకున్నాం -

ఒక మీన మిథునం
ఒక తారకా శారికల జంట
మన కంటి పాపల్లో కదలాడుతుంటే
నిరుపమానులకు ఉపమానం మనం
అన్నావు నీవు -

# రక్తిలో ముక్తి

దేవాలయాల మీద
బూతుబొమ్మలు చూచినప్పుడు
బావా నీవు
జ్ఞాపకం వచ్చావు –
బావా అని కాదు
నిన్ను
"నా సామిరంగా" అని
పిలవాలని బుద్ధి పుట్టింది
నిన్ను మూరలతో కాదు
నా బారలతో కొలవాలనే
భక్తి కలిగింది –

మాయా భోగం చూస్తుంటేనే
నా మతి పోయినపుడు
నీ నిజ భోగం అనుభవిస్తే
నేనే అసలు మిగులుతానా!

రాతి బొమ్మలకు తెలిసిన
రమణీయ రహస్యాలు
ఈ నాతి బొమ్మకు బోధించు!
నా మనో మందిర
మదనమూర్తీ!
నా భక్తితోనే
నీ శక్తిని పెంపొందించు !
నీ రక్తిలోనే
నాకు ముక్తిని ప్రసాదించు !

# ప్రేమ స్తంభం

ఆ చీకటి గదిలో
నా వ్రేళ్ళూ నీ వ్రేళ్ళూ
నిమురుకున్నప్పుడు
అనంతానంద వృక్షపు
కూకటి వ్రేళ్ళు తాకినట్లనిపించింది –

చర్మం చర్మం తాకితేనే
నర్మగర్భం గగుర్పించి గదా
మరి మన సశరీరాత్మలు
ప్రేమ స్తంభం చూట్టూ
పెనవేసుకుంటే
ఆకాశపుటంచులే
మన నయనాంచలాలైపోవా!

మన స్పర్శకు కూడా
దర్శనాసక్తి ఉంది
మన హృషీకాలకు
ఆనంద బ్రహ్మ
వశీకరణ శక్తి ఉంది
అందుకే
మన నిమిషమాత్రపు
పొందులో అనిమిషత్వముంది
హృదయేశ్వరీ!
మన ప్రణయతత్వంలో
అనశ్వరత్వం వుంది.

# దేహ శుద్ధి

ఉన్నదాన్ని ఉపేక్షిస్తే
లేనిదేదో లేచి రాదు
కన్నదానిని కాదనంటే
కానరానిది కానరాదు
నా సఖుడా! బహు ముఖుడా!

సాపేక్షం
నిరపేక్షం - అంటూ
సమయం తీరు మాట్లాడి
సత్యాన్ని హత్య చేసే
శాస్త్ర చికిత్స చేయకు !
నా మోహబద్ధ
దేహశుద్ధి చేయకుండానే
ఆత్మానాత్మ
విచికిత్స చేయకు -

నీ కౌగిటిలో
నేమన్నానో లేదో
నిశ్చింతగా చెప్పేయి
నీ కాంక్షలు తీరుస్తున్నది
నిజమో కలయో తేల్చేయి -

# దిగంబరులు

ఋతు చక్రంతో పని లేని
ఋతంభరులం మనం
దిక్కులు చూచే పని లేని
దిగంబరులం మనం –

ఋతంభర దిగంబర
సతీపతులమైన మనం
గతాగతాలు లేని
వర్తమానాలమైన మనం
ఒకరి నొకరం చుట్టుకొని
వేదాంత లతాంతాల
వీరగంధం పూసుకొని
నిర్నిద్ర రుద్రారామంలో
నిర్గుణ లింగాలింగనంలో
అఖండ జీవన వసంత
ఆనంద తన్మయులం మనం –

కోహం – సోహం
కోకిలాలాపంలో
త్వమేవాహంగా
తాదాత్మ్యం చెందే
తనూతంత్రులం మనం –

ఇపుడు ఎందుకు
ఈ మట్టిగోడల మధ్య
ఇరుక్కుని ఉన్నాం
సరస సల్లాప
సంభోగయోగంలో
ఇంకా ఏమిటి వెతుకుతున్నాం ?

అయితే
ఈ రాళ్లను రత్నాలుగా మార్చే
రాపిడి మానవద్దు
ఈ చీకట్లను
వెలుతురుగా తీర్చే
సుత్తె దెబ్బలు ఆపవద్దు.

శ్రమ చేతన ప్రమ కేతన శిల్పీ!
నీ చిత్తంలోని రూపం
శోభించే దాక
ఎత్తిన ఉలి దించవద్దు.

# సహజ ధర్మం

వేదాంతాలు చెప్పగలిగే
విజ్ఞత నాకు లేదు గాని
సహజ. ధర్మాల గుర్తించే
సంస్కారం మాత్రం ఉంది
చెలికాడా! నీ మీద నాకు
షికాయత్తు కాస్త ఉంది –

గాలికి వీచడం ధర్మం
ఏరుకు పారటం ధర్మం
పక్షికి ఎగరటం, పాముకు ప్రాకటం
మబ్బుకు కురవడం, మంచుకు కరగడం
ధర్మం –

నెమిలికి ఆడడం ధర్మం
కోకిలక్కు పాడడం ధర్మం
పూవులను వాడడం ధర్మం
నీవు నేను కూడడం ధర్మం
సహజధర్మాలు తెలిసికోక
సందేహాల మందేహాల క్రింద
నలిగి పోవడం ఎందుకు ?
ధర్మాల మర్మాలు తెలిస్తే
దారి తప్పడం ఎందుకు ?

నా అహంభావాన్ని అణచడం
నీ ధర్మం
నీ ముభావాన్ని తొలగించడం
నా ధర్మం

కలలో కూడా నీ రూపాన్నే
కనగలిగే కనులు నాకు కావాలి
నాకలలను వాస్తవీకరించే
కామశక్తి నీకు రావాలి
పాతాళపు లోతుల్లోకి
పడద్రోసినా
కైలాస శిఖరాలు అందుకునే
ప్రావీణ్యం నీది
నింగినంట ఎగురవేసినా
నిమిషంలో నేల మీద పడిపోయే
తారళ్యం నాది
ధర్మవీరా!
ఎవరి ధర్మాన్ని వారు పాటించి
ఇరువురం తరిద్దాం.

# నిదురలో పరీక్ష

ఏ కొండ మీదలేని హాయి
నీ గుండె మీద ఉంది
నీ గుండె మీద నెలకొన్న కొండలు
నిగూఢ గుప్తమైనవని
నా ప్రగాఢ విశ్వాసం –

నా విశ్వాసశ్వాసలు
ఆ గిరుల సూక్ష్మ గభీర మైన
చరియలో పడిపోయి
బయటకు రాలేక పోతున్నవి –

చిద్విలాసంగా
నాదృక్కులు
ఆ కొండ మిట్టల మీద కూర్చుండి
ఆశాపాశాలతో
పాతాళపు లోతుల్లో నుంచి
ఊపిరులను తోడుకుంటున్నాయి –

ఈ ఆటవిక ప్రేమ తంత్రం
చూడలేక అలసిపోయిన
నీ కనీనికలు  నిదుర పోతున్నాయి
నాది నిదుర లేని నిరీక్ష
నీది నిదురలో కూడా పరీక్ష

# ఊపిరి ఊయల

లోతైన లోయల్లోని
వెచ్చదనం
ఎత్తైన కొండలమీది
చల్లదనం
నీ ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో
అనుభవించే
ఊయలను నేను
చెలీ!
నీ ఊపిరిని నేను –

నీ స్థూల నితంబ పీఠం
నీ సూక్ష్మాలక నీల కిరీటం
సంరక్షించే
విస్ఫులింగ కదనఖడ్గాన్ని నేను
ఉత్తుంగ మదన దుర్గాన్ని నేను
సతీ, బిబ్బోకవతీ!
నీ స్వర్గాన్ని నేను –

నీ నడుము చేత నాట్యమాడించే
వెన్ను పూసకు మంత్ర విద్యలు నేర్పే
ప్రబుద్ధ సర్పాన్ని నేను
ముగ్ధ మోహినీ!
నీ దర్పాన్ని నేను –

నీ సుగమనిగమ సుభగత్వానికి
విశాల నేత్రత్వానికి
నీ చంచల చపల చేలాంచల
ప్రాపంచిక తత్వానికి
కేతనాన్ని నేను
నీలవేణీ,
అరుణ పాణీ
నీ
చేతనాన్ని నేను -

# నీ కన్న నే మిన్న

నా మీద నీవు సాధించిన
విజయం కన్నా
నీ చేతుల్లో నేను పొందిన
ఓటమే మిన్న –

నీ ప్రచండ ప్రతాపోజ్జ్వల
ముఖ మండలం కన్నా
సొమ్మసిల్లిన
మసక చీకటి క్రమ్మిన
నా కన్నులే మిన్న –

విశ్రమించని
నీ తరంగిత శక్తి సింధువు కన్నా
నిశ్చలమైన
నా నొసటి మీది
ఒక స్వేద బిందువే మిన్న –

నీ భ్రమా భ్రమర
నిర్గుణావరణ భ్రమణం కన్నా
నా ప్రమా పుష్ప
సగుణ శాంత వికసనం మిన్న –

అందుకే
నన్ను నిలువెల్లా దోచుకొనే దొరా
విజానికి
నీకన్నా నేనే మిన్న –

# ఆనంద కేళి

రసరూపిణిగా
భాసించే నీకూ
రసోహంగా భావించే నాకూ
మధ్య రహస్యాలెందుకు?
అంతరంగ బహిరంగాలనే
అంతరాలెందుకు?.

మన పుట్టుకతోనే పుట్టిన
ఇంద్రియాలను
వట్టి మట్టి మాయని కొట్టేస్తే
మనకు మిగిలేదేమిటి ?

అద్వైతులమై
అద్వితీయ ప్రేమావేశంతో
ఆనంద కేళి సలుపుదాం
పరస్పర రూప ధ్యానంలో
పరస్పర విషయాధ్యయనంలో
పరవశించి పోదాం
రుజా జరామరణాలను
రూపాలకు వదిలేసి
నిత్య సత్య సాంగత్యంలో
నిర్గుణులం అయిపోదాం.

కవిపించేది కనిపించనిది
మన కౌగిటిలో కలిసికొనేటట్లు
తెలిసికొని జీవిద్దాం
నీ పేరూ నా పేరూ
మరచిపోయి
శివశివాభిద నాదంగా
రవళిద్దాం -
పాప పుణ్యాల, ధర్మాధర్మాల
పంజరం వీడి విహరిద్దాం -

నా బాధా గరళ
గళం చూట్టూ
నీ ప్రమోద బాహో నిగళాలు చుట్టి
మోక్ష మంటే ఇదేనని
సాక్ష్యం చెప్పే సారసాక్షి!
నీ పక్షమే నాకు రక్ష!

# ప్రణయ ప్రణవం

కృపామయీ! అంటూ
నీ కొంగు పట్టుకుంటే
త్రపామయివై కూర్చున్నావు
నీ సందేహం తీర్చే
సందేశం విను!

కామం లేని ప్రేమం
వాసన లేని పుష్పం -

ఇహం లేని పరం
చీకటి లేని వెలుగు -

శరీరం లేని ఆత్మ
గూడు లేని పక్షి -

అందుకే
ప్రణయం లేని ప్రణవం
రథం లేని సారధి
పథం లేని గమ్యం
స్వరం లేని సంగీతం -

మనది ప్రణవ ప్రణయం
ప్రణయ ప్రణవం
జీవిత రథ సారథ్యం
సప్త స్వర సంగీతం
భావ భౌతిక జీవితం -

## బాపురెడ్డి కొన్ని ఇతర రచనలు -

బాపురెడ్డి పద్య కావ్యాలు

బాపురెడ్డి గేయ నాటికలు

అనంత సత్యాలు

శ్రీకార శిఖరం

నాదేశం నవ్వుతూంది

ప్రేమారామం

మన చేతుల్లోనే ఉంది

పంచబాణ సంచా

In Quest of Harmony

Longing for Life

URN OF LOVE